# ABHAGYOPAKHYANAM.

A humorous poem in one canto.

BY

K. VEERESALINGAM,

*Senior Pundit, Rajahmundry College.*

THIRD EDITION.

MADRAS:

PRINTED BY N. BRAHMANANDAM NAIDU,

AT THE CHINTAMANI PRESS,

*4, Adiappah Modaly Street, Porasapakam.*

[illegible]

Price 1¼ Anna.

# అభాగ్యోపాఖ్యానము.

హాస్య ప్రబంధము.

ఇది

రాజమహేంద్రవరము దొరతనమువారి కాలేజిలో

ప్రధానపండితుఁడగు


కందుకూరి - వీరేశలింగముచేత,


రచియింపఁబడినది.

రెండవ కూర్పు.


చెన్నపురి:

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1898.

దీనివెల 1½ అణా.

# అభాగ్యోపాఖ్యానము.

## హాస్యప్రబంధము.

క. శ్రీరమణీహృల్లోలా। కారుణ్యలతాలవాల కాంచనచేలా
ఘోరాహవజయశీలా। శ్రీరాజమహేంద్రవరపురీగోపాలా. ౧.

వ. భవదీయకరుణాకటాక్ష వీక్షాసమాసాదిత సరసకవిత్వ పటుత్వంబు పెంపున నేఁ గల్పింపంబూనిన హాస్యరసప్రధానంబగు నభాగ్యోపాఖ్యానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. ౨.

క. అడవులలోఁ గడునిడుములఁ। గుడుచుచు ధర్మాత్మజుండు కొందలపడఁగన్
వడిఁ బరిహాసకుఁ డొకఁ డ। య్యెడకునుజనుదెంచి మ్రొక్కి యీకథ చెప్పెన్. ౩.

గీ. వింధ్యధాత్రీధరప్రాంత వంధ్యభూమి। జలములేనట్టి యొకపాడుకొలనుదరిని
దండకారణ్యమధ్యంబుఁ దనరఁజేయుఁ। బాపసదనంబు వ్యాఘ్రాఖ్య పట్టణంబు.

క. ఆపురము లచ్చియప్పకుఁ। గాపురము, జగంబులందుఁ గలపురములలోఁ
గాపురము, పాపసమితికిఁ। దాపురము, మహాపుర మలదానవతతికిన్. ౫.

క. అన్నగరంబునఁ గరము। భ్యున్నతి వహియించుకుజనపుంగవకోటి
త్యోన్నతి కోడుటఁ గాదే। పన్నగకుల మెల్లఁ జేరెఁ బాతాళంబున్. ౬.

సీ. వెలయాలినింటనె విడియించి దానిచేఁ దిట్లునుదన్నులుఁ దినెడువారు
తల్లిపోయిననాఁడు దానింటనేయుండి పనియున్నదిదె వత్తుననెడివారు
కన్నెతికము చేయు కార్యంబునకుఁ బూర్వులార్జించుమాన్యమ్ము లమ్మువారు
భోగకాంతలుగాక పొరుగువారల భార్యలను జేరి సౌఖ్యంబుగనెడువారు
విలువసారాయిసీసాలకొలఁదిఁ ద్రావి। యొడలు దెలియక వీధులఁబడెడువారు
నగుచు మర్యాదలను గాంతు రనవరతము। బ్రాహ్మణోత్తములా దివ్యపట్టణమున. ౭.

చ. కురుబలముం గనుంగొనుచుఁ గోటితురంగజనంబుతోడ ను
త్తరుఁ డరదంబు డిగ్గి పురికట్టునఁ బాఱియుఁ గ్రీడి ప్రేరణన్
మరలఁగఁ బోరికేఁగుటకు నవ్వుచునుందురు పోటుబంటులై
పిఱికితనంబునం బురిని పేరువహించిన రాజపుంగవుల్. ౮.

గీ. బియ్యమున వడ్లు బెడ్డలు పెక్కుగలిపి
నేతిలో నంటిపండ్లను నెఱయఁబిసికి
తప్పుతూనికతూచుచుఁ దక్కువగను
గొలుచుచును గోమటులు సొమ్ముఁగూర్చుకొంద్రు. ౯.

గీ. కూటసాక్ష్యంబు బ్రాహ్మణగురులవలన। బాగుగా నేర్చుకొని పాటుపడుటమఱచి
జూదములదొంగతనముల శూరులగుచు। శోభఁగాంతురు పురిలోన శూద్రజనులు.

చ. తనపలుముండ్లవాఁడిమిని దప్పక వాసవువజ్రమున్ జయిం
ప నతిదృఢంపుమట్టు లనుమైమఱువొప్పఁగ నేగి ముండ్లచే
ననిఁ గులిశంబు గెల్చి తనకడ్డగువేల్పులకండలొల్చి తా
నొనరెననంగ బ్రహ్మజెముడొప్పగు నెఱ్ఱనిపండ్లగుంపుతోన్. ౧౧.

చ. పురిఁ దగుఁ జుట్టునుంగదిసి భూరిభయంకరలీల దట్టమై
పెరిఁగినగచ్చపెన్ బొదలు పెట్టనికోటగ. లోనియీతచాల్
బురుజులుగాఁగ, దాపునను బొల్చినతుమ్మలు పెద్దముండ్లతో
సురియలుదూసి సద్భటులు స్రుక్కక కావలిగాచుతీరుగాన్. ౧౨.

సీ. మార్దవం బంగనామణులచన్నులయంద సాహసంబాహారసమయమంద
ప్రజ్ఞయంతయును దంభములుకొట్టుటయంద బంటుతనము వంటయింటియంద
మితభాషణము శాస్త్రితతులచర్చలయంద కలిమి పురంధ్రులకానులంద
నిలుకడ నెలఁతలనేత్రయుగ్మములంద ధైర్యంబు పెద్దలఁదఱుముటంద
వడి లతాంగుల వంకరనడలయంద। శాంతి యొంతయు దుష్కర్మసహనమంద
కానిమఱియొందువెదకినఁ గానరాద। నంగఁ దద్దయు నాపట్టణము వెలుంగు. ౧౩.

గీ. తివిరిపాపపుంజంబు మూర్తీభవించి। వచ్చిగుమిగూడి ప్రోల్ప్రారఁబాలుకరణిఁ
బందిగున్నలు చెరలాడు సందులందు। దున్నపోతులకైవడిఁ జెన్నుమీఱి. ౧౪.

గీ. చేరినిల్చిన వంటయిల్ చేరినిల్చుఁ। గానవచ్చినఁ బరువెత్తి కానసొచ్చు
డంబుమీఱిన భటసమూహంబుతోడ। సాటియౌదురె మానవకోటి నెవరు. ౧౫.

గీ. పీటఁగల్గిన ఘోటకకోటితోడ। నిలిచిప్రాఁకంగ నేరక నీరుసొచ్చె
వెఱచి తాఁ బేటిగుంపులు వేయునేల। పురినిబుట్టిన నుక్కైనఁబుచ్చిపోవు. ౧౬.

చ. దనుజులు మర్త్యులందునిమి తత్తనుమాంసము మెక్కిపోవఁగా
నెనసి పురంబునల్గడల నెమ్ములరాసులు భూధరంబుల
ట్లనుపమలీలనుండెఁ బ్రమథావళితోడ మనోజవైర యీ
మనికికి వెండికొండయని మాటికివచ్చుఁ బరిభ్రమమింపుచున్. ౧౭.

ఉ. కొంపలమీఁదితుక్కుఁగఱిఁగొట్టుకుపోవఁగఁ దూముకాల్వలోఁ
గంపునుగూడి తోఁటలనుగల్గిన కుక్కపొగాకుచెట్లబల్
గుంపులవాసనంగలిగి కుప్పలు నిప్పులు రాల వేఁడిలో
ముంపుచు వాయువుల్ పొలయు ముక్కునవెండ్రుకలెల్లమాడఁగన్. ౧౮.

ఉ. అంగన లూర మెల్లఁ జనునప్పుడు కూడెదమంచు లేళ్ళుఁ జి
వ్వంగులుఁజేరి యోటువడువారనిఁ గెల్చినవారుమ్రింగఁగాఁ
బొంగుచుఁబన్నిదంబడఁచి పోవఁగఁ జాలక త్రేఁడులోఁడెఁ జి
వ్వంగులు గెల్చెఁ గానియెడ వానికి లేళ్ళనుజంప నేటికిన్. ౧౯.

ఉ. ఆపురమేలు రాక్షసమహాకులవారిధిబాడబుండు, కా
శీపురనాథవిష్ణుసరసీరుహసంభవపాదభక్తసం
తాపకరుండు, పుణ్యవసుధాధర వజ్రధరుండు, ప్రోల్లస
త్పాపధనంజయానిలుఁడు, దానవుఁ డొక్కఁ డభాగ్యనాముఁడై. ౨౦.

సీ. వానిదుష్కీర్తితో వాసిచెందఁగఁ బూని కుందుచుఁజీఁకట్లు గుహలనడఁగె
వానిమైబిగితోడ వాదులాడఁగఁ బూని ఖడ్గమృగంబులు కానడాగె
వానిచాపలముతోఁ బ్రతిఁబొందఁగాఁ బూని వానరజాలంబు వనముదూఱె
వానిమాంద్యముతో సమానంబు రాఁబూని దున్నలు బురదలో దొర్లఁదొడఁగె
వానిక్రౌర్యంబుతో దినుసూనఁబూని । జడిసి వ్యాఘ్రంబు లడవిలో సంచరించె
వానికంఠస్వరంబుతో వాదుపూని । పొరలె గార్దభబృందంబు బూదిలోన. ౨౧.

క. నిరతము శంభునిపూజలు । కరమొనరుచుచుండుపక్షికంఠుఁడు సరియే
పరమాధమగుణుఁ డగునీ । హరదూషణపరున కవని వ్యభిచారమునన్. ౨౨.

క. వదలక వారలసమ్మతి । ముదమున దినమొకని బకుఁడుపొలియించెను వీఁ
డదరక బలవంతంబుగఁ । బదుగుర నూర్వుర దినంబుఁ బట్టివధించున్. ౨౩.

క. ధీరహితుండైతగియు న । ధీరహితుండై ధరిత్రి దీనత నేలెన్
క్రూరాగ్రేసరుఁ డావిబు । ధారాతి తనదుచరిత్ర మతిచిత్రముగాన్. ౨౪.

ఉ. అతనికిఁ బొట్టకోసినను నక్షరమొక్కటిలేదు; కాగడన్
వెతకినఁ జెల్విలేదు; దయ వీసమునుం గలనైనలేదు; ప్రో
న్నతనయవిద్యలేదు పదునాల్గుపుటంబులు పెట్టికాల్చినన్;
జతుగత వాతపెట్టినను సత్యము జిహ్వకు రాదొకప్పుడున్. ౨౫.

వ. అతఁడొక్కనాఁడు. ౨౬.

సీ. ఒకదిక్కునను గుక్కలొకగ్రుక్కగాఁగూయ నొకచెంత బలుదుంతు లొలసియార్వ
నొకమూల ఖరజాల మురళీలనోండ్రింప నొకచోట గుడిసేటియువతులడల
నొకదండ ముదిముండ లొకదండుగాఁగూడ నొకవంకబలుకుంక లొదిగియుండ
నొకపొంతఁగడమంతలొకదొంతరగనుండ నొకక్రేవ మఘుసేవ లొనరఁ జేయఁ
బెంటపోగులుఁ జీపుళ్ళుఁ బేడకుప్ప । లలుకుగుడ్డలుఁ గోడియాఁకలునుదనరి
డంబుమీఱిన శునకాసనంబునందుఁ । గొలువులోఁ జచ్చినట్టులు కూరుచుండె.

ఉ. ఆగతిఁ గొల్వులోన దనుజాధముఁడుండి గులాము నొక్కనిన్
వేగమ పిల్చి వేఁటపయి వేడుక నాకిపుడుద్భవిల్లె వే
వేగమ వేఁటకాండ్ర మనవేపులఁ దోడ్కొనిరమ్ము నావుడున్
సాగి యతండు చచ్చిచెడి చాలఁగఁ జెప్పినరీతిఁ జేసినన్. ౨౮.

గీ. ముడ్డియెండియున్న మొద్దుగుఱ్ఱముమీఁదఁ । గదలకుండ నెక్కి కాళ్లు నేలఁ
దగులఁగూరుచుండి తక్కినవారలు। వెనుకఁ జేరితోల వెడలెనతఁడు. ౨౯.

వ. అట్లుమిడిమిడియెండం గాళ్లుగాల నెత్తిమాడఁ బురంబువెడలి. 30.

చ. మలమున మూఁగు నీఁగల క్రమంబునఁ బీనుఁగు చుట్టుఁ జేరున
క్కలగతిఁ బుల్లెపైఁగవియు కాకులకైవడి వేఁటకాండ్రుఁ గు
క్కలు సరిదార్లు నల్గడలఁ గ్రమ్మి రయంబున నేగుదేరఁగా
వెడలె నతండు కాకములు వేపులు నక్కలుఁ గూయుచుండఁగన్. 3౧.

వ. అంత. 3౨.

చ. దనుజునిఁ జూడ సూక్ష్మతరదారుణనేత్ర యొకర్తు ముందుగా
నెనసిన మొండిగోడపయి నెక్కిన ముద్దియయొర్తు వచ్చి తా
వెనుక కుఁ ద్రోచె నందునను వెన్కకు నెమ్ములురాలఁగూలి మా
నిని వెసమూర్ఛపోయె వడి నెచ్చెలు లేడిచి రొక్కపెట్టునన్. 33.

ఉ. పీతశిరోజ యొక్కరిత వే దనుజుం గన గోడయెక్కి యు
ర్వీతలమందు జాఱిపడి రింగునదొర్లుచు దైత్యుఁ జేరె ని
ర్భీతమనోజ్ఞయై కలన పీరమునం బసుగొల్వఁ జాలుబం
ట్రౌతుల డించి తన్నుఁగొని గ్రక్కునఁ బొమ్మని వేఁడవచ్చెనాన్. 3౪.

ఉ. బాడిదచెట్టు కుప్పకుచభాగ యొకర్తు నరాశనాధమున్
జూడఁగ నెక్కఁ దన్మహిజసూనచయం బొగి నెండుకాయలం
గూడి సుపర్వవైరిపయి గుంపులుగాఁ బడుపెంపు వొల్చెఁ జె
న్నేఁడిమి మింట దైత్యుపయి వేలుపు లుల్కలు రాల్చిరో యనన్. 3౫.

చ. అటుచని యూరిబైటఁ గలయంజరియించుచు నొక్కతావునన్
బెటుకున ముందుగాఁ జెవులపిల్లిని గన్గొని కుక్కగుంపులన్
బటుమతి దానిపైఁ గవియఁబంపఁగ నవ్వియు నేగి క్రమ్మఱన్
దటుకున వచ్చెఁ గాట్లుపడి తత్పురికుక్కల ధైర్యమేమనన్. ౩౬.

ఉ. అవ్వల నూరఁబందియొక టడ్డమువచ్చినఁ దచ్ఛటావళుల్
చివ్వకు నీటెలంగొనుచు శీఘ్రమె పర్విడఁ బంది వారలన్
దవ్వులఁజూచి లో బెదరి దారుణభంగిని ఘుర్ఘురింపఁగా
నెవ్వడిఁ బాఱెరాభటులు నిల్వక దానికిలొంగ కుక్కనన్. ౩౭.

గీ. పందిఁ బొడువంగవచ్చినభటచయంబు । బెండువడి పందితోడనే బెదరియుఱికె
శశముఁ బట్టంగవచ్చినసారమేయ । వితతి శశకంబుతోడనే వెనుకఁ దిరిగె. ౩౮.

వ. ఇట్లు భటశ్వానంబులు బెదరి చెదరిన రాక్షసాధ్యక్షుండు రూక్షవీక్షణుండయి కుర్కుర మర్కట మార్జాల శశకాద్యనేకాక్షుద్రమృగకులంబులఁ బొలియించి మృగయావినోదంబు సలుపుచుండ నొక్కచో నొకతరుక్షుపువీక్షించి తురంగంబు భయాకులాంతరంగంబయి యికిలించుచు నపరాహ్ణసమయంబున సరోవరసమీపంబున బురదనేల నతనిఁ గూలవైచి చనినయనంతరంబ యంతకుమున్న విట్చరంబుచేఁ దఱుమంబడి యచ్చట డాఁగియున్నభృత్యుండొక్కరుండు చనుదెంచి లేవనెత్తిన. ౩౯.

గీ. బురదతుడిచికొనుచుఁ బొక్కుచుఁజనుదెంచి । యతని గ్రుచ్చియెత్తి యాదరించి
పందిచేతఁబడక పఱచివచ్చినయట్టి । పౌరుషంబుకొంత ప్రస్తుతించె. ౪౦.

వ. అట్లుసేదతేఱి తీరస్థితవటమహీరుహచ్ఛాయం జేరి భృత్యసహితంబుగా నందు విశ్రమించియున్న యవసరంబున. ౪౧.

చ. శునకమురోదనంబుగతి సూకరనాదముభంగి గార్దభ
స్వనమువిధంబునన్ ప్రబలసైరిభరావముపోల్కి దవ్వులన్
వినఁబడె రాక్షసాధమునినీనుల కెంతయు విందుసేయుచున్
ఘనవినపంబు భూమిధరగహ్వరజాలము మాఱుమ్రోయఁగన్. ౪౨. ✓

శా. ఆనాదం బతఁడాలకించి మది నాహాయంచు భావించి చి
త్తానందంబున భృత్యునింబిలిచి నీవాచప్పుడే తెంచును
స్థానంబారసి వేగ మాధ్వని ప్రభూతంబౌటకుంగారణం
బానందంబునఁ జేరఁబోయి కనిరమ్మా యెవ్వరిట్లార్చిరో. ౪౩. ✓

క. ఆనాదము విన్నంతనె । మానసమున కెన్నరానిమమత జనించెన్
శ్వాననినాదమొ యొకఖర । యాననినాదంబొ వేగ నారసిచెపుమా. ౪౪.

చ. అనవిని భృత్యుఁ డాక్షణమ యానతిఁ గైకొని గట్టుడిగ్గి కా
ళ్ళను బెనుముండ్లు గ్రుచ్చుకొనలాగుచు మ్రొగ్గుచు వేగలేచుచున్
జనిచని డొంకముండ్ల మెయి సర్వముఁ జీరుకుపోవ నోర్చుచున్
బొనుపడుచున్నపాడుగుడిపొంతను మొద్దగుచాపరాతిపైన్. ౪౫.

మ. కనియెన్ దానవదూత సూక్ష్మనయనన్ గాలాంతకాకారి ని
ర్ధనజీవన్ ఖరవాణిఁ గీశసమవక్త్రిన్ రక్తవర్ణాలకన్
గనదుద్యద్వసుధాధరాంచితవలగ్నన్ భూరినీలాధరన్
ఘనదేహన్ లసదుష్ట్రియాన విలసత్కాంతాకదంబాధమన్. ౪౬.

చ. కనుఁగొని దైత్యుచెంగటికిఁ గ్రమ్మఱ నచ్చి యతండువల్కె నో
దనుజకులావతంసమ ముదంబున నీవటు నన్నుఁ బంపఁగా
ఘనమగుముండ్లచెట్లనక కంకరరాళ్ళన కెంతదూరమో
చనిచని పాడుదేవళముచక్కని నేను మహాద్భుతంబుగన్. ౪౭.

సీ. వ్రేలుచన్నులు కొంత బిలమువెల్వడిక్రిందఁ జనుకొండచిలువలజంటగాఁగ
నేత్రాంతములనుండి నెవ్వడిఁ బఱతెంచుకన్నీళ్ళు సెలయేటిగములుగాఁగఁ
గర్ణరంధ్రంబులు ఘనవక్త్రబిలమును రమణీయతరగహ్వరములుగాఁగ
గాత్రమంతట నిక్కుఘనరోమసంఘంబు ధాత్రీరుహములబృందంబుగాఁగఁ
గుఱుచలౌ యెఱ్ఱవెండ్రుకగుంపులడరి । యడవిదహియించునట్టి దావాగ్నిగాఁగ
గొప్పపర్వతముకరణిఁ గూరుచున్న । పొలఁతిఁగంటిఁ బురాకృతపుణ్యమునను. ౪౮.

వ. తదీయరూపాతిశయంబులు వివరించెద నాకర్ణింపుము. ౪౯.

చ. చెడుగులనేటి యొక్కగుమిచేసి విధాతృఁడు గార్దభంబులన్
బుడమి సృజింప వానిమెయి భూరికురూపము చాలమిఁ బదం
పడి యొనరించెలొట్టియల వానికి మిక్కిలి కుస్వరంబు చే
పడమి నొనర్చె నేర్పుమెయి భామను రెండునుగల్గియుండఁగన్. ౫౦.

చ. పవలునునుండుపెద్దమము పాడుగుణంబులు రూపుదాల్చి యీ
భువనములోనఁ గ్రుమ్మరఁగఁబుట్టినభీకరవిగ్రహంబు బాం
ధవనిచయంబునేచ వసుధాస్థలిఁగల్గుపిశాచభామ తా
భువిఁ జరియించుసంపదలముద్దియయక్క నెలంత యొంతయున్. ౫౧.

ఉ. చారునగంబులన్, ధనువు, సంపెగపూవును, గెంపుఁ గూర్చి, సిం
గారపుఁజన్నులన్, బొమల, ఘ్రాణము, వాతెఱఁ జేసి, బ్రహ్మ తా
వారక వానికర్కశత, వంకరఁ, బచ్చన, రక్తకాంతిఁ బెం
పారఁగఁ దీసి చేసె, మెయి, యూరును, గన్నులఁ, గుంతలంబులున్. ౫౨

చ. ఘనతరమధ్యభారమునఁ గంపమునొందెడునూచకాళ్లు పెం
పొనరఁ బిఱుందులుం ఘనతనొందినఁ దాళఁగలేవటంచుఁ దా
వనరుహగర్భుఁ డెంతయును వంత మదిం దలపోసి సూక్ష్మలో
చనకుఁ బిఱుందులు న్నిగుల సైకముగానొనరించె నేర్పునన్. ౫౩

గీ. కొమ్మగాదది మేటిపెద్దమ్మగాని । బాలగాదది యముచేతికోలగాని
కన్నెగాదది బలిసినదున్నగాని । నారిగాదది జనులకుమారిగాని. ౫౪

గీ. అట్టి కన్నియయును నీవు ననఁగి పెనఁగి । కనరులేనట్టి మమతలఁ గలసిరేని
యెందునీతచెట్టుపయిఁ గోరిందతీఁగె । యల్లుకొనురీతిగాదె యోయమరవైరి. ౫౫

చ. అని చెలికాఁడు తెల్పుటయు నాక్షణ మారజనీచరేంద్రుఁడున్
మనమున సంతసంబడర మానినిఁజూడఁగ మిత్రునెంటనే
చనియెను ద్రోవలోఁగలుగుసర్వమహీజలతావిశేషముల్
గనుఁగొనుచున్ మృగావళులఁగాంచుచు డొంకలముండ్లఁజూచుచున్. ౫౬

చ. కనుఁగొను సంగడీఁడ యదె గట్టుకుఁజేరువ గచ్చతీఁగ మిం
చినతమి గట్టిగా ముసిఁడిచెట్టును జుట్టుకయుండె మేలుమేల్
దనుజకులాగ్రగణ్య నిను దారుణలీలఁ గవుంగిలించి యా
వనితయు నట్టులే మిగులవంతలఁబెట్టి కలంచు మీఁదటన్. ౫౭

క. తెప్పానపకాయలఁగను। ముప్పులబలుముండ్లఁ బెచ్చులూడెను సఖుఁడా
యప్పడఁతిచన్నుతిత్తులఁ । దప్పక నీవట్లుచీరి తనరెదు నాథా. ౫౮

క. చూడుమదె గార్దభాంగన । తాడనమొనరించెఁ బనదుభవుని వయస్యా
చేడియ నిన్నునుసరసం । బాడెడునపు డిట్లుతన్ను నమరవిరోధీ. ౫౯

క. ఇటు లన్యోన్యంబును ము । చ్చటలాడుచు నేగియేగి చామను గుడిచెం
గటఁ గని మేనువడంకఁగ। నటనుటతో నిర్జరారి యనియెనుదనలోన్. ౬౦

ఉ. దీనిని నేనువేఁడినను దిట్టునొ కొట్టునొ లోనికేగునో
మానిని బల్మిఁబట్టుటయు మంచిదిగాదని యూరకుండి నే
నూనశరార్తినెక్కుడణి స్రుక్కుడు నేవిధినైన నిప్పుడీ
చానను గూడువాఁడనని చప్పుడుసేయక మెల్లమెల్లఁగాన్. ౬౧

చ. వెనుకకువచ్చి చేయొడిసి వేగనుబట్టిన లేచి దానవుల్
గనుఁగొని కొమ్మ తానెడమకాలున ముందరిపండ్లురాలఁ దా
చినఁ దగనోర్చి నెచ్చెలియు భీయన వెండియుఁ గౌఁగిలింపఁ జూ
చినఁ జెలి భీతి గర్భగుడి చేరెను దల్పులు వైచి గొబ్బునన్. ౨౨.

ఉ. అంతట దైత్యుఁడుం దలుపులల్లనగుద్దుచు నిన్నుఁగూడ కొ
క్కింతయుఁ దాళలేననుచు నేడ్చుచు లబ్బున మొత్తుకొంచు ని
న్నంతయుఁగూలి పైఁబడినయట్లు విలాకునఁగూరుచుండ నా
చెంతకుఁ దార్పుకత్తెయొకచేడియ వచ్చె మెలంతసారయన్. ౨౩.

గీ. వచ్చి గుడిచెంతఁగూర్చున్నవారిఁగాంచి। మీరు రక్తవర్ణాలక సైరిభాంగి
మర్కటానన పర్వతమధ్యభారి। యనిత నెందైనఁ గంటిరేయనుచునడుగ. ౨౪.

ఉ. దానవభర్తవల్కు నవితా వినుమిచ్చటి కేను వేఁటకై
సేనలఁగూడివచ్చి గుడిచెంగట నేడ్చుచునున్నదాని నీ
వానతియిడ్డలక్షణములన్నియుఁ గల్గినదాని నొక్కకే
శాననఁ గాంచి కేలొకటనంటిన నీగుడిదూఱె నివ్వెఱన్. ౨౫.

ఉ. ఆకనుదోయిసూక్ష్మతయు నాచనుతిత్తులమార్దవంబు నా
మైకఠినత్వసంపదయు మానిని నేఁ గనుఁగొన్నయంత నే
నాకరగాత్రిపై మనసుపొచ్చెను నిక్కువ మెట్టులైన నా
కాకపివక్త్రఁగూర్చి రయంబున నేలుము నీకుమ్రొక్కెదన్. ౨౬.

ఉ. ఎయ్యది యూరు దీనివిభుఁడెవ్వఁడు పుట్టినవంశమెద్ది పే
రెయ్యది యొంటిగా నిచటి కేటికివచ్చె నిజేడ్వఁ గారణం
బెయ్యది నాకుఁజెప్పఁగదవే కలరూపు కటీంద్రయాన నీ
వెయ్యదిగోరినన్ సరగనిచ్చెద దానిని నన్నుఁగూర్చినన్. ౨౭.

చ. అన నదివల్కు నోజనవరా ఖరగామినిరీతిఁ జెప్పెద
న్వినుము సుబుద్ధినాఁబరఁగునీయమభర్త యతండు రూపునన్
మనసిజుగెల్చునైనఁ జెలి పల్లవసంగతి యెప్డుకోరు గ్ర
క్కునఁ బొరుగింటిపుల్లనగుకూరయుఁ దా రుచిగాదె యేరికిన్. ౨౮.

ఉ. నిన్నటిరాత్రి యీమె యొకనీచభుజంగునిఁ గూడుచున్నచోఁ
గ్రన్ననవచ్చి వల్లభుఁడు కన్గొని కోపముతోడ వీఁడు నేఁ
డిన్నడిరేయి యొంటి మనయిల్లుచొరంగ నిమిత్తమేదియో
యున్నది యున్నయట్లు చెపు మూరక దాపక యన్న విన్నయై. ౨౯.

గీ. బొంకుటకుఁ జేతఁగాక యీయంకులాడి । నోర గుటకలు మ్రింగుచు నూరకున్నఁ
గాంచి కోపించి యొకపెద్దకఱ్ఱతోడ । వీపు బద్దలుగాఁ గొట్టె వెలఁదినతఁడు. ౨౦.

ఉ. కొట్టిన మొత్తుకొంచు వడి గ్రుడ్డుల నీరొగిఁ గ్రుక్కుకొంచుఁ బెన్
ఱట్టులఁ బెట్టి వీధిఁబడి ఱాగతనంబునఁ బాఱివచ్చి యీ
కట్టిఁడి యంకులాడి తనకాపురమూడుట కోర్చి దేవళం
బట్టులు దూఱెఁ గన్గొనఁగ నిట్టివె యాఁగడ జారిణీగతుల్. ౨౧.

వ. అనికురంగగమన సవిస్తరంబుగా నా మెఱుంగుబోఁడి తెఱంగెఱింగించి తలుపు చేరి యిట్లని పిలువందొడంగె. ౨౨.

ఉ. డాయనుభీతిఁబొంద మగఁడా యనుఁ దల్పులు తీయరాదె రం
డాయనుఁ బల్కవేమి చెవుడా యను సొమ్ములువెట్టు అంకుమున్
డాయను వేగ రావె మొఱ డాయను లోపలఁ జేరి యేడ్వఁ గా
డా యను సిగ్గుఁబూనుటె పుడా యను నెచ్చెలి మాటిమాటికిన్. ౨౩.

తే. గొంతు పగులంగ వినువారి కెంతొ చెవులు । తడకలును గట్టు నాలుక పిడచవాఱ
నెంత యార్చినఁ జెవిఁ జొరనీక యుండె । దున్నపోతుపై వర్షంబు తొరఁగినట్లు. ౨౪.

చ. తడిసిన నుల్కకుక్కగతిఁ దామ్రశిరోరుహ యంతకంతకుం
గడు బిగియంగఁ జూచి తటకాపడి గుండెను ఱాయిపడ్డ వే
నడవఁగలేక గోతిదరి నక్కతెఱంగునఁ గాచియున్న యా
చెడుదనుజుండు నెత్తికిఁ కఁ జేతులు వచ్చెనటంచు రోఁజుచున్. ౨౫.

ఆ. కొంతసేపు పాడుగుడిచెంతఁ గూర్చుండి । రోదనంబు చేసి రోసి కూర్కి
తలుపు తీయు జాడఁ గలనైనఁ గానక । విసిగి దూఱిఁ గొంచు వెడలె గుడిని. ౨౬.

చ. అటువలె దేవళంబపుడె యాయమతోడను దానవేంద్రుఁడు
త్కటమగుకన్కతో వెడలి గార్దభగామిని మీఁది ప్రేమచేఁ
బటుకపనఁ బాయలేక నుదిఁ జాలిమిఁ దాలిచి పొంతనిల్చి మి
క్కుటముగడిన భానమునఁ గూర్కి బయలడ్డ దూఱి కిట్లనున్. ౨౭.

క. ఓసీ పను నీవిపుడీ । కాసరనిభగాత్రితోడఁ గలిపెడవేనిన్
గాసులపేరిచ్చెద నీ । యాసకుఁ దగినట్టిరొక్క మటులుండెంగన్. ౨౮.

తే. అనిన నదియెంతపనియని యపుడె బయలు । దేఱి దేవాలయంబును జేరఁబోయి
మెల్లఁగా మిత్రు రాత్రిని మేలమొప్పఁ । బిలిచినంతనె యాజెంత తలుపుతీసె. ౨౯.

క. తలుపునడిసినవెనుకను । బలుకులు చెవిలోనఁ గొన్ని బహురమ్యముగా
నలుపొప్పఁగఁ జెప్పిన విని । యలఖురవాణియు నిచాటమంతయుఁ దీఱన్. ౩౦.

క. చెలికత్తియతో గుసగుసఁ । బలుమాఱునుమాటలాడి బహుధనమును సో
మ్ములు వలువలునుఁ రాక్షస । కులబాడబుఁ డియ్యనొప్పుకొన్నసువార్తన్. ౫౧.

ఉ. తిన్నఁగ విన్నపిమ్మటను దీయనిమాటలు చెప్పి వానితోఁ
గ్రొన్ననవిల్తుకయ్యమునఁ గూడుట కుబ్బున సమ్మతించె నా
చెన్నఁటిదూతియు న్మరల శీఘ్రముగా దనుజాధమాధముఁ
డెన్ననఁగాంచి సర్వమును దెల్పి సురాలయబాహ్యభూమికిన్. ౫౨.

తే. తోడుకొనివచ్చి గుడిలోన దూఱుమనుచు । సైగచేసిన వాఁడును వేగఁజొచ్చి
తలుపు లోపలబిగియించి తగినయంత । గబ్బిలపుపెంటగమ్మునఁ గంపుకొట్ట. ౫౩.

తే. ఉక్కలోనాపెతో సౌఖ్యమొందుచుండె । మిగులఁదనలోనగుటకలు మ్రింగుకొనుచుఁ
జేతు లొండొంటితోఁ జేర్చి దూతికయును । గడపముందటఁ గావలికాచుచుండె.

తే. ఈకథానాయికయయినయిగురుఁబోఁడి । మగఁడుకొట్టినవీధులుమాఱుమ్రోయఁ
బెద్దపెట్టున నేడ్చుచు వీడువెడలి । పోయి యెందునుగనరాకమాయమయిన. ౫౪.

సీ. ఏనూతిలోపల నేగికూలెనోయంచు భయపడి మగఁడును బంధువులును
వీధివీధులవెంట వెదకుచుఁ బఱతెంచి జాడలఁబట్టి యాపాడుగుడిని
జేరియచ్చోటను జిడుముపొక్కులు గోకుకొంచును గడపలోఁ గూరుచున్న
దూతికఁబోడగాంచి దుర్మార్గురాలైనయీలంజెముదిముండమూలమున నె
మనకు నిన్నిపాటులువచ్చెననుచుఁబలికి । యందఱును జేరి యాదూతినంటఁగట్టి
నెమక సున్నములోనికి నెముకలేక । యుండ దంచిరి పిడిగుద్దులొకటఁబఱపి. ౫౫.

గీ. అటుపిదప నర్ధచంద్రప్రహారములను । దానియబ్బతోడను జెప్పకొనుబంచి
వెనుక దేవాలయముతల్పు వేసియుంట । గాంచి లోపల నెవ్వరో కలరటంచు. ౫౬.

క. ఊహించి తలుపులొక్కట । బాహాబలమొప్పగుంజి పగిలినమీఁదన్
సాహసమున లోఁజొరఁబడి । దేహంబంతయుఁజెమర్చ దిగులున మూలన్. ౫౭.

గీ. ఒదిగివడఁకుచున్నయుష్ట్రియానను రాక్ష । సాధముని జూచి యలుకతోడ
వీపెగుద్దులొకట వేనవేల్ కురిపించి । కొప్పు జుట్టుఁ బట్టి గుంజియీడ్చి ౫౮.

గీ. వెలుపలికిఁదీసికొనివచ్చి వీపుమీఁద । ముఖముమీఁదను మెడమీఁద ముక్కుమీఁద
మఱుగుగుద్దులవానలు మచ్చుచూపి । పిండిపెట్టి రభాగ్యని నిండుగాను. ౬౦.

గీ. దెబ్బలకుఁదాళఁజాలక దితిజవరుఁడు । తిరుగఁబడి బండతనమునఁ దెగువచేసి
వారితోడను బోరాడ వడిఁగడంగ । వారలందఱు నాగ్రహావార్యవృత్తి. ౬౧.

చ. తటుకునఁ జుట్టుముట్టి పదతాడనకూర్పరఘట్టనంబులన్
జిటిపొటిమొట్టికాయలను జేరలనిండినచెంపకాయలన్

బటుతరముష్టిఘాతములఁ బల్లులును స్వేదచల్లి దేహమం
తట రుధిరమ్ము గ్రమ్మఁ గత్తిదైత్యుని నెత్తురివానిఁ జేసినన్. ౯౨.

ఉ. తాళఁగలేక సొమ్మసిలి దానవుఁ డల్లనమూర్ఛవోవఁగా
బాలికబంధువుల్లని యభాగ్యుఁడు వచ్చెనటంచు నెంచి యా
భీలతఁ జాపలోపలను బెట్టి యభాగ్యునిఁ జుట్టికట్టి దే
వాలయపూర్వభాగమునయందలిగోతను వైచిరొక్కటన్. ౯౩.

క. వైచి పురంబు తలారులు । చూచిన మోసంబువచ్చుఁ జూడకయుండన్
వేచనవలె నని గొబ్బున । నాచంచలహృదయుఁ గొంచు నరిగిరి పురికిన్. ౯౪.

వ. అంతట నిచ్చట. ౯౫.

గీ. విద్యారంబుతలుమ వెలుచిపర్వి డివచ్చి । గోతియందుదాఁగి కూరుచుండి
పందిగుంపులచట బయలనుదిరుగుచు । నునికిఁ జేసి షయికిఁ జనఁగ నోడి. ౯౬.

క. భటులిరువురు గర్తమునం । దటునిటుపీక్షించుచుండి యచటునఁదమపై
నటు దయ్యమువలె శవము । క్కటిపడిన మూర్ఛపొంది ఘటికాద్వయికిన్. ౯౭.

క. తెలివొంది కనులువిప్పుడు । నలశవముం గదలఁజొచ్చె నాశూరులకున్
గళవళ మునుమడికాఁగను । బెళపెళయని చాపచుట్టు బిట్టుగ మ్రోయన్. ౯౮.

ఉ. అంతట నాభటద్వితయ మాత్తఁదలంకుచుఁ బైకిఁబోయినన్
గంతునవచ్చి ఘుర్ఘురము గ్రక్కునఁ జంపునొ క్రిందనుండినన్
సంతసమాఱ దయ్యమిది చంపునొ యక్కట యేమిబుద్ధి యం
చెంతయుఁ జింతనొంది పనియేమియుఁ దోఁచకయుండె నింతలోన్. ౯౯.

గీ. చాపలోనుండి "ఘనులార! చావకుండ । బంధములుకుప్పి నన్నింత । బతుకఁ జేయుఁ"
డనెడువాక్యంబు విన్నైన నానవారలు । పట్టి తమరాజు న్నైదమాట వడి నెఱింగి. ౧౦౦

గీ. కట్లు విప్పితియుఁ గాయంబునిండను । గాయములు చెలంగఁ గనులువిచ్చి
దిత్యనాథుఁడే పుడు తన । ప్రాణభృత్యుల । యాననములఁ జూచె దీనవృత్తి. ౧౦౧.

క. అన్యోన్యముఖాలోకన । ధన్యత్వముఁ జెంది భటులు దను జేం[ద్రుం]డున్
[illegible] । నన్యోన్యక్షేమవా[ర్త]లాడిరి ప్రేల్లన్. ౧౦౨.

క. ఆడిరి తమకొదవినయా । ఘోరాపదల్లఁ జూచి నటుపాపిష్టితో
ధారుణిలోఁ గ్రమ్మఱఁ జూ । మీరిప్పుడుగ నగుట నెలుగొనుచున్. ౧౦౩.

గీ. రాజు తమచెంత నున్నట్టి రత్నంబుకు తన । బయలఁ దిరిగెడు కేలులకు భయమువడక
విభునితోఁగూడ యాగోయి నటులఁజూచె । దేముడుకు రాజు కన్నెత్తలేకపోయి.

క. ఆసైరిభాస్యబంధులు । చేసినయుపచారమహిమచేతను జరణం
బాసమయంబున దనుజా । గ్రేసరునకు వశముగాక కీలుతొలంగెన్. ౧౦౫.

క. అదిగని సందేహింపక । సదుపాయధురీణులైనసద్భటవర్యుల్
ముదమునఁ బైకెక్కినృపుఁ । సదమలగతి నీడ్చి రతఁడు శ్రమచేమూల్గన్. ౧౦౬.

శా. ఎంతో కష్టముమీఁద దైత్యవిభుఁ బైకిట్లీడ్చి యామీఁదటన్
వంతు ల్వెంబడి మోవనెంచి యదియున్ భారంబుగాఁదోఁచినన్
స్వాంతంబు ల్చలియింపఁ జింతిలి మహోపాయంబుఁ గన్పెట్టి య
త్యంతంబు న్మదిసంతసిల్లి గుడిచెంతం జేరి యొక్కమ్మడిన్. ౧౦౭.

క. పందిరిగడలనురెంటిన్ । సందిటఁ గొనివచ్చికట్టి సద్వాహనమున్
సుందరగతిఁ జేసి మహా । నందముతో రాజు నందు నయమొప్పారన్. ౧౦౮.

క. శయనింపఁజేసి యిద్దఱు । దయతోడ న్మాపుపైనిఁ దద్వాహనమున్
గయికొని పరమపదంబున । కయి చేర్చుమహానుభావుకరణిని నృపునిన్. ౧౦౯.

వ వహియించి నృగయావినోదమహోత్సవంబు నిర్వర్తించి పునఃపురప్రవేశంబుచేయ
నవధరించు నవనీధవపుంగవుం బురవీథుల నూరేగించు మహావైభవం బపూర్వంబై
యుండె నాసమయంబున. ౧౧౦.

సీ. అత్యద్భుతంబైన యావాహనంబును వీక్షించి కుర్కురవితతి మొఱుగ
వీథివెంటనుబోవ విధవాంగనలుచూచి శవమని వెనుకకు సరగనరుగఁ
బయినుండిబాధచే వడిమూల్గుటాలించి తమచుట్టమని ఘూకతతులుచేరఁ
గ్రొత్తగా శవవాహకులువచ్చి రెందుండియని ప్రాఁతవాహకు లడుగుచుండ
శ్వాననినదంబు మాగధస్తవముగాఁగ । విధవలభయస్వరములు దీవెనలుగాఁగ
ఘూకఘూంకారములువాద్యఘోషములుగ । నగరుచొత్తెంచెనాతఁడునడిమిరేయి.

వ. ఇట్లుపరమరహస్యంబుగా నంతఃపురప్రవేశంబుచేసి. ౧౧౨.

ఉ. మంచముమీఁద దేహమిడి మూల్గుచు మూల్గుచు బాధనొందుచున్
జంచలదృష్టిఁ జూచుచును జారులకెప్పుడునిట్టిపాటులే
మించుగసంభవించునని మించువెత న్మదిలోఁదలంచుచున్
బంచత యింతకంటె బహుభంగుల మేలనుచు న్వెతంబడెన్. ౧౧౩

గీ. వైద్యులను బిల్వనంపించి వారిచేత । నౌషధంబులుచేయించి యక్కజముగ
బాధకుసహింపలేక యభాగ్యనృపుఁడు । మందుపట్టింపక శరీరమందొకింత. ౧౧౪.

క. వరుసగ మొలమునుదలయును । శిరమును గరములును వాఁచి చెప్పంగఁ గపి
శ్వరులెవ్వారును నొల్లని । మరుదశమావస్థ నతఁడు మానక చెందెన్. ౧౧౫.

క. ధరణి నభాగ్యమహాసుర । చరితము విన్నట్టిపుణ్యచరితుల కెల్లన్
బరవనితారతి చెడునని । పరిహాసకుఁ డానతిచ్చెఁ బాండుసుతునకున్. ౧౧౬.

క. ధరణీజనమందారా । సురమునిగణనుతవిహార సుగుణాధారా
పరిభావితరిపువీరా । దురితనిచయఘనసమీర దుఃఖవిదారా. ౧౧౭

మాలి. అనుపమగుణసాంద్రా యాదవాంభోధిచంద్రా
జనఘనసుతిపాత్రా సజ్జనాంభోజమిత్రా
వనధికృతవిహారా వల్లవీచిత్తచోరా
దనుజచయవిరామా దర్పితారాతిభీమా. ౧౧౮.

గద్యము. ఇది శ్రీమత్సకలసుకవిజనవిధేయ కందుకూరి వీరేశలింగ
నామధేయ కల్పితంబయినయభాగ్యోపాఖ్యానంబను
హాస్యప్రబంధంబునందు సర్వంబును
నేకాశ్వాసము.



